శ్రీ దే వ తా యై న మః

కవిమణి, కవికేసరికిశోర, బాలసరస్వత్యభినవసరస్వతీ,

శతావధానకుశల, విద్వద్బాలశతావధాని

బిరుదాంకిత జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

విరచిత

# కరీంనగర సంపూర్ణశతావధానము

---

మ. మునుగావించిన యోరుగల్లు నగరీ పూర్ణావధానంబు...
దున నిశ్శంకజయంబుగూర్చితివి సంతోషంబె...గాని
సినయాచేతల నీ కరీంనగరిలో శ్రీమాన్యులీక్షించిరే
జననీ! నేడును నాటివోలె గరుణా సంధానమ...

సీ॥ ఆంధ్రసంస్కృతగోష్ఠియా! మున్ను పలుసార్లు
విన్నదేయని నవ్వివెడలువారొ
ఆశుకవిత్వమా! అపదోషచయపూర్ణ
మగునుగా ! యనిమేలమాడువారొ
అష్టావధానమా ! యందునేనాధిక్య
మరయ నౌనని ! సెప్పి యరుగువారొ
శతఘంటకవనమా ! చాలుప్రాచీన
రీతియేయని ! చప్పరించువారొ

కానికొక మూఁడువందలుకవులుగలరు
వారిలో నీతఁడొకఁడనువారొయేమొ
అంబ ! సర్వస్వమున్నీవె ! అట్టివారి
కేటి యుత్తరువిత్తువో యేమొవాణి.

## 1. రామాయణ కథాసంగ్రహము.

క॥ జనకుని యాగమునన్ భువి
జనియించి ధరాత్మజాత సతిజేసి వనిన్
జని యబ్ధిదాఁటి రావణు
దునుమాడి యయోధ్యనేలు దొరభజియింతున్.

## 2. హనుమత్ప్రార్థన.

శా॥ ధీరస్వాంత! దినేశనందన! కృపాదీప్తిన్ విజృంభించుచున్
శ్రీ రామార్థ పదాంబుజాత యుగళీసేవాభిలోలస్థితిన్
వారాశిన్దగఁదాఁటి భూమితనయావార్తాప్రబోధంబునన్
మీఱంగల్గినదేవ! వాయుసుత! స్వామీ! మమ్మురక్షింపవే.

## 3. సమస్య.

ఉ॥ కంతుఁడు రేగుచున్ శరనికాయములన్ గుఱిసేయ నాశచీ
కాంతుఁడు గౌతమాంగన సుఖంబుననుండెను; శాపమబ్బెబ
ల్వింతలకన్నులయ్యెఁ బ్రతిబింబితవైఖరి సాధువైరి లో
కాంతకుకన్నులన్ గుచయుగాళి జనించెను జవ్వనంబునన్.

4. పెట్టె-బెట్టు-దిట్ట-గట్టు-వెద్ది. (వీనితోఁబద్యము)

గీ॥ పెట్టెలోనిడితాళంపు బెట్టువైతె
ధనము బుధులడ్గ? దిట్టవు;ఘనగుణమణి
గణములకు రోహణంపుఁ బెన్గట్టువెద్ది
ఘనకలాబ్ధికిఁ జెలియలిగట్టు చెపుమ?

5. సమస్య.

శ్లో॥ హత్వానృపంపతి మవేక్ష్యభుజంగ దంష్ట్రాం
పత్యంగ చిహ్నిత మతోనృపకార్యమేత
న్నస్యాదితివ్యాభిసమీక్ష్యచకావ్యవాదీత్
శోచామి గోపగృహిణీం కథమిత్యతక్రమ్

6. సమస్య.

క॥ నిద్వేభుభాస్కరలోచన!
రాడ్వంశజ! సర్వశత్రు రాడ్వందిత స
మ్రాడ్వల్లభ! నిగమాంత్రాబ్రు
ద్రుడ్వేదితోదార! సురవిరోధివిదారా॥

7. శంకరస్తవము.

ఉ॥ తావకపాపహారి పదతామరసంబుల నాశ్రయించి మే
ధావిభవాభిసంగమవిధానమునం బరితోషమంది త
త్కేవలసత్యలోక వసతిం దయసేయు మటన్ననీయవే
యీవె విశాకరాదులకు నేని వరంబులనోయిశంకరా॥

### 8. సమస్య.

క॥ లీలాభి నాట్యలోలుఁడు
చేలీకృతసర్వ దిగ్విశేషుఁడుదుష్టా
స్ఫాలన లీలానిర్జిత
కాలుఁడు తుహినాద్రిజాతకాంతుండయ్యెన్॥

### 9. సభా వృత్తాంతము.

సీ॥ రక్తాక్షి సంవత్సరమునఁ జైత్రపు గృష్ణ
పంచమి నాఁడరుదెంచినాఁడ
ఆహ్వాన మొనరించినట్టి పల్వాల శేష
గిరిరాయఁడాప్యాకారి నరసినాఁడ
వారిహేతువ నాంధ్రభాషాధినిలయంపు
సభ్యులకృపఁ జెందఁజాలినాఁడ
తత్ప్రసాదమున నుత్తమదయాభాసుర
పురజన ప్రోత్సాహ మరసినాఁడ
గీ॥ అటఁ జతుర్దశిరేయి నేఁడైన యంత
మొదలుపెట్టితిసభ; శుద్ధవిదియ నేఁడు
మూఁడుగంటలః సర్వంబు పూర్తియయ్యె
ధారణాసభయియ్యది ధన్యులార॥

### 10. నృసింహావతారము.

మం॥ ఖరారీంద్రున్ వికటభవ సంభృద్ధిరణ్యాభిధానున్
గాటింపంగన్ ఘనగుణగణా క్రాంతుఁ బ్రహ్లాదుఁ బ్రోవన్

వీరావేశ ప్రియతర మహోవేషముందాల్చు లోకా
ధారాస్ఫూర్తిన్ దలఁతునెదలోఁ దన్నృసింహావతారున్.

## 11. దశావతారసూచివిష్ణుప్రార్థన.

ఉ॥ శ్రీమహితుండుమత్స్యరుచిఁజెందియుఁగూర్మవరాహమూర్తి
శ్రీధామన్నృసింహమూర్తియయితద్దయువామనుఁడయ్యు రాముఁడై
రాముఁడు రాముఁడై సుజనరక్షకు బుద్ధుఁ డుగల్కియై పరం
ధాముఁడు దుష్టభంజనవిధానధురీణుడుఁ బ్రోచుమమ్ములన్

## 12. కరీంనగర విద్యావిధానము.

సీ॥ ఉన్నత పాఠశాలోద్యోగమునఁ జేసి
భాషాత్రయ దినానువాద మొప్ప
ఆంధ్రభాషానిలయాది సంస్థాపన
నాంధ్రభారతి వన్నెలందుచుండ
సరసత్కవివరసభాశతవధానాదుల
హృద్యాదిభారతి హెచ్చుసూప
నరనాథ సంథిత నగర మందిరములు
విద్యా ప్రసంగాభివృద్ధిసేయ
గీ॥ సరసగోపాలరాయాది చారుభక్త
వర్యుల పురాణగోష్ఠియు భక్తిపెంప
ఐహికాముష్మిక ప్రమేయాంచితంబు
శ్రీకరీంనగర కలాభివృద్ధిభాతి॥

## 13. సమస్య

శా॥ ఆంగ్లేయాభినిధత్త యంత్రశకటవ్యాపారముం జేసి తాఁ
బెంగ్లానిందొరగారు వచ్చెనదిగో వేవేగ నీచెంగటన్
బంగ్లాపైదొరసానియున్నదఁట నాపై నందయంబూని యా
బంగ్లా మీదికిఁ ద్రోవఁజూపఁగదవే భామా! కురంగేక్షణా!

## 14. సమస్య

శా॥ ఆవేగంబుదయించె నుష్ణతకు లోకాలోకపర్యంతమి
ట్లీవిశ్వంభర లేతమొక్కల జలంబీక్షించె క్షామంబునన్
లావైయొప్పెను సస్యసంతతి కివేలా వర్షముల్ లేవహో
ప్రావృట్కాలము వచ్చునెన్నఁడు భవాభావా! భవానీపతీ!

## 15. కామినీ గర్హణము.

మత్త॥ మానినాధమనంబులైనను మాయచేమఱలించి స్వా
ధీనచిత్తులఁ జేసి మానులఁ దెంపుమై నభిమానమున్
మానమున్ విడనాడఁ జేయుచు మాన్యకీర్తిధనంబులన్
బోనడంచెడు నన్యకామిని పొందుపోలదె వారికిన్

## 16. సమస్య.

శ్లో॥ దేవాస్తుయజ్ఞైర్హృష్టా దదత్యుర్వ్యాజలాదికం
శ్రీవిష్ణోదేవయజనం రక్షస్వాశుభహేతుకం ॥

## 17. ఉస్మానియా ఆంధ్రభాషానిలయము.

సీ॥ ఆంధ్ర త్రిలింగముఖ్యాఖిల ప్రతికల్
ప్రతి వాసరమ్మును బరగుచెంచు
రామాయణాది సద్గ్రంథ రాజమ్ములు
పఠియింప సిద్ధతం బరగుచుండు
అహరహం బార్యసమావేశములుగల్గి
సత్ప్రసంగంబులు జరుగుచుండు
భాషాభివర్ధన వ్యాపార కారణ
పండితోత్తమ గౌరవంబు లొప్పు
గీ॥ అనుపమానంద జనక శతావధాన
ముఖ్య పండిత చాతుర్యపోషణమ్మ
నెగడు నెచ్చోట శ్రీకరీం నగర బంధు
రాంధ్ర భాషాభినిలయమ్ము హరువు గనుత॥

## 18. సరస్వతి.

సీ॥ ఏ దేవి కావాసమిద్ధ కవీశ్వర
మానిత చతురాననాననములు
ఏసాధ్వి చనుదోయి భాసుర సంగీత
సాహిత్యనిత్యప్రచారణంబు
ఏమాత శిష్యుం డహీన రామాయణ
కర్తయా వాల్మీకి కవిసరుండు

ఏరామ చాతురి హృద్య విద్యా(దాజ
మండల భావాభి మండనంబు
గీ॥ ఆమహాపూత సర్వలోకైకమాత
సాధుసందోహసంత్రాణ స్తవ్యమాన
శ్రీకరీంనగరస్థితాస్తోక మంజు
లాంధ్ర భాషాధినిలయ సభ్యాళిం బ్రోచు॥

19. ప్రతిజ్ఞాప్రావీణ్యములు చెల్లుచు గాని ప్రతిమ చిక్కునె?

సీ॥ అభిమానధనము సమార్జించి కీర్తి
నిలుపంగా నేర్చిన నిపుణమతికి
ప్రాణసందోహసంరక్షణంబునకన్న
యశము నెక్కుడుగాగ నరయు గుణికి
ధీరసంగ్రామ పృథ్వీస్థలిం నిల్చుచో
వెనుదీయ నేరని వీరమణికి
వరదానదక్షదైవము పాద పద్మముల్
బట్టుచో విడువని భక్తమణికి
గీ॥ ప్రవిమలంబైన యుద్యమ వ్యాప్తింజేసి
స్వప్రవీణత యది తేటపడు నెగాక
ప్రతినలున్ జెల్లుంగాని సంపదల కోర్కి
ప్రతిమ చిక్కునె? యట్టి కార్యంబు ఘనమె॥

## 20. సమస్య.

క॥ ఎట్లాత్మవిభుఁడు గోరెనొ
యట్లే సతిమూఁలుదాల్చె నాచారములో
పాట్లుడిగినఁ దగు నెలలన్
ముట్లుడిగిన సతికినొక్క పుత్రుఁడు పుట్టెన్

## 21. పరమాత్మ.

సీ॥ ప్రథిత గోవర్ధన భారసంవాహియై
ప్రాంచితరూప మెవ్వాఁడుపూనె
సకలమునీంద్ర కౌతుకమూలకర్తయై
భవనీయ రూపమెవ్వాఁడుపూనె
భక్తవల్లభనరప్రార్థనల్ దీర్పంగ
పటుతర తేజ మెవ్వాఁడుపూనె
గురునరాదవ్రజ క్రూరతాశాసియై
భయద వేషంబు నెవ్వాఁడుపూనె
గీ॥ ఆమహాత్ముఁడు సర్వలోకైకకర్త
యుండియున్ లేని నైఖరినుండువాఁడు
అఖిల మాయాప్రచార రహస్యమూర్తి
మమ్ము మిమ్ముల నెల్లరన్ మనుచుఁగాత ॥

## 22. సమస్య.

సీ॥ ఇనుమంతయున్ భక్తి యెఱుఁగనేరనిపూజ
నముఁనకు పత్రసంధాన మేల ?

ఆవంత పూరుషవ్యాపారమెరుగని
వానికి మీసాలపని యదేల ?
నుంతయుఁ బాండితీస్ఫూర్తి యెఱుంగని
పండితునకు శాల్వపని యదేల?
భవనీయమగు కేశపాశంబెఱుంగని
తలిరుబోఁడికిఁ బూవుదండలేల?
గీ॥ అంకులాడికి నాచారశంకలేల?
తధ్యమాడనివానికిఁ దపము లేల?
శక్తిలేనట్టి వానికి శౌర్యమేల?
డబ్బురాని వకీలుకు డంబమేల ?

23. మన్మథగోష్ఠి.

సీ॥ అంగవిహీన బాధాంత సమ్మతిఁ జేసి
మన్మథసంగరోన్మాదమబ్బె
అంగజునకు నంగహైన్యంబుఁ జేకూర్పఁ
గందర్ప ఘోరసంగ్రామ మబ్బె
రత్యనంగకసుఖ ప్రార్థనంబునఁ బోలె
కాయసంజాత సంగరము గల్గె
సర్వధాత్రీశాంతి సంఘటనార్థమై
సుమబాణ కదనవిస్ఫూర్తికలె
గీ॥ ఈశ్వరుని యంతవానికి నీక్షణమున
బాదిగావించి మన్మథ భూతిఁనతడె

మరలఁబీడితుఁడయ్యెఁ దన్మాయవలన
మాయురే యేమి సృష్టి? మన్మథునిగోష్ఠి

24. సమస్య.

శ్లో॥ శరేణ వైరిణం హంతి
స్వాత్మనా దుర్భరేంద్రియాన్
తపసా కలుషాన్హంతి
సర్వం కేనాపి హన్యతే

25. భాషా। నిలయాభివృద్ధిమార్గము.

ఉ॥ పౌరులు దుర్వ్యయంబనక భవ్యమతిప్రతిభాభిలాషులై
చేరుచు గ్రంథముల్ పఠన సేయుచు శక్తికొలంది పత్రికా
వారము లీక్ష సేయుచును బ్రాహ్మతరార్థ సహాయతావిధిన్
వారక సేయుచున్నయెడ వాఙ్నిలయంబభివృద్ధి సెందదే?

26. వైశాఖమాసము.

మ॥ ధరణీజాతములెల్ల లేఁజిగురులన్ దారుణ్యమున్ జూపె హృ
త్సరసీజంబులు పల్లవించె విటసంజాతంబులన్ జూతసం
దరశాఖాతతి దాల్చె సత్ఫలములన్ దాళోర్విరుట్పత్రభా
స్వరలీలాధుర చామరంబులెగిరెన్ వైశాఖమాసంబునన్

27. సమస్య.

చ॥ సరసిరుహంబులెల్ల పరిసారిత చారుకలావిభూతినిన్
దొరగెను; శోణదీప్తిమెయిఁదోచెను; బశ్చిమభాగమెల్లభా

స్ఫురఁ దతిశోణితోగ్రరణసంస్థలిలోనికి వీరసింహు వై
ఖరి వడి గుప్పునం దుముకుకై వడిగ్రుంకెఁ బయోనిధిస్థలిన్

28. ముక్కంటి తలపూవు.

క॥ కలువచెలికి గిలిగింతయు
గొలుపన్ వెన్నెలలనించి కువలయమలరన్
దొలిదిక్కున ముక్కంటికి
దలపువు జేజేలబువ్వ దర్శనమొసఁగెన్॥

29. సమస్య.

క॥ శుష్కాంగుండై తన యా
యుష్కాలంబెల్ల తపమునొనరింపంగన్
నిష్కాముఁడైన తాపసి
పుష్కరమునఁ ద్రివిధమూర్తి పుంగవునిఁగనెన్॥

30. సమస్య.

శ్లో॥ నైదాఘాంశుతీక్ష్ణతా ప్రకటితాచండాంశురుజ్జృంభతే
భూమ్యాకాశతలాంతరాళ పదవీం ధూళీవ్రజోవ్యాపృతః
కోశద్వంద్వపరీతపత్తారనగరీం గంతవ్య మేవాధునా
పానేచ్ఛాజనితాదయా మయమహాఃపానీయమానీయతాం

31. శతావధాన గౌరవము.

॥ అడుగఁగావలె సముద్యద్భావ గుంభన
వ్యాపార కారణ ప్రశ్నములను

పరికింపఁగావలె భావార్ధగతమాధు
రీద్యోతకములగురీతులెల్ల
మెచ్చఁగావలె రసామేయశయ్యానూన
మంజుల కవితాభిమార్దవంబు
అర్పింపఁగావలె నలఘు పండిత సభా
పాత్రబహూకృతి భాజనంబు
గీ॥ సౌరభవిసారి సూన సంచయములందు
ముంచగ వలె మోదంబు నించవలయు
నటులఁ గాకున్న శతవధానోధి విజయ
సాధని సరస్వతీదేవి శాంతిపడునె॥

## 32. సమస్య.

క॥ శ్రీకాంతా లావణ్యా।
స్తోకుఁడ వంఘ్ర్యబ్జజనితశుభనది కతన౯ ।
గాకోదరాంగద శ్రీ
కూకుదుడవు నింతకంటెఁ గుతుకముగలదే॥

## 33. సమస్య.

గీ॥ బ్రహ్మ విజ్ఞాన హేతు భావప్రబోధి
నిత్య కర్మాభి నిరతుఁడే ద్విజుఁడుగాని
యగునె కలు ద్రావ జందెమ్ము లవలఁ ద్రోసి
పచ్చి మాంసంబు దినువాఁడు బ్రాహ్మణుండు?

## 34. వేంకటేశ్వర స్తవము.

సీ॥ అఖిల పాపక్షయ వ్యాయత్త చిత్తాబ్జ
యబ్జజాది స్తోత్రహారి మూర్తి
మూర్తి సౌందర్య సంభూషిత భూచక్ర
చక్రలాంఛితహస్త సరసిజాత
సరసిజాతోపమస్ఫురణాంబకవిభావ
భావభవ వ్యక్త పరమ తేజ
తేజోవినిర్భిన్న ధీరదిగ్వ్యజరాజ
రాజ మనోజ్ఞాస్య రాజమాన
గీ॥ మానవానూనభావవిజ్ఞానదుర్గ
భ్రప్రభాభోగ; భోగవైభవ విశేష
నిర్జితాఖిల సంసేవ్యనిర్జరేంద్ర;
యింద్రసుతహిత; హిత వేంకటేశ! ఈశ!

## 35. సమస్య.

ఉ॥ వేసమెగాని దద్హృదయవీథిఁదపశ్చరణ ప్రకార మ
భ్యాసము గల్గదెల్లరును నాత్మ సమానులె యందుహా! విష
ర్యాసము, మాధవా! యసురులందునుమీఁదుమహాంబుగల్గదా
మీ, సము లేని; వారలకు మెండగు మోహము దేమిచిత్రమో.

## 36. శ్రీవిద్య

శ్లో॥ శృంగార భ్రమణేపిదైవ విషయాచింతాసమాలోక్యతే,
సాహాయ్యంచ హ్యాదీశ్వరస్యరచితంకాలోచితం కాంతయా

ఏవంచాపికదాపి దుఃఖజనకా విద్యావతీర్దృశ్యతే

లేఖానాత్మభుజంగ వల్లభ గృహంసంప్రేషయం త్యద్భుతం॥

37. సమస్య.

చ॥ సరసజగత్ప్రపాలన విచారణ కర్తలలోన నాదిశం
కరుఁడును భక్తవల్లభనికాయములన్ హనుమంతుఁడుర్విగవీ
శ్వరులనుఁ గాళిదాసు పెరవారలఁ దిట్టెడి వారిలో మనో
హరకవి వల్లభుండగు గ్రహంబులలో నుడురాజు కైవడిన్॥

38. యిలయమందిందువదనుడు—మోమెత్త—కదలికప్పువిడె

(ఈపదములతోఁ బద్యము)

సీ॥ విరహంబు రోగంబు విరతి కోయిలయ మం
దిందువదనుడు ప్రియేశ్వరుండు
స్తవనీయ సుమశరా సారోపచారంబు
సేవ్యాను పానవిశేషలీల
మలయోర్విభన్మందమారుత పోతముల్
విశ్రమదాయక వీజనములు
గారుడమణిరత్న ఖచితసౌధంబులు
నాత్మ శయ్యార్హ పర్యంక చయము

గీ॥ ముద్దుమోమెత్త సౌరభస్ఫూర్తియెల్ల
కదలికప్పు విడెమ్ము సూక్ష్మంపు దిండి
యనగ నొప్పించు లేత జవ్వనము సారు
తీరు వర్ణనసేయ నెవ్వారితరము?

### 39. సమస్య పూర్వార్థము.

శ్లో॥ భోజ్యేషుమాతా శయనేషురంభా
కార్యేషుమంత్రీ కరణేషుదాసీ
తాదృగ్గుణాఢ్యాకులముద్ధరంతీ
లోకేషు కీర్తించధనంచదద్యాత్

### 40. సమస్య

నరహరిమతో వాయవనపం
నభజతిహిభావే సముచితం
నకిమపిచధర్మం నచహితం
హరహర నహిందుర్నయవనః

### 41. సమస్య

తృణానినోన్మూల యతిప్రభంజనో
న కేసరిర్మత్తగజం వినేతరం
నరావణాదన్యజనంచరాఘవో
మహాన్‌మహత్యేవ కరోతివిక్రమః

### 42. సమస్య

క॥ చెంతం గోసిన దూలము
కంతన్ బలిముఖుఁడు దురదకై యిడి తోకన్
గ్లాంతివడె బెట్టు జాఱఁగ
గంతికి మిడుకంగఁ గూడ గల్గినభంగిన్

43. అష్టావధానము కష్టమా? శతావధానము కష్టమా?

ఉ॥ ధారయు ధారణాబల ముదారకళల్ సనవేని నూటికె
వ్వారును జెప్ప లేరు; తగుపాండితి నేర్చినయంతమాత్రనన్
ధీరసభాంతరంబుల సుధీనిపుణాష్టక మొప్పిమెచ్చనౌ
తీరునఁ జెప్పనోపునది తెల్లము కష్టమెదో యెఱుంగరే

44. నిజాంప్రభువువారి యౌదార్యము.

సీ॥ కట్టించె నెవ్వాడు గగనచుంబితసౌధ
రాజి విద్యాప్రవర్ధనముకొఱకు
త్రవ్వించె నెవ్వాడు ధనధాన్యకారణ
గురుసరోవరములఁ గుశలుఁడగుచు
పాలించు నెవ్వాడు స్వపరభేదవిహీన
పద్ధతిమైఁ దన ప్రజలనెల్ల
కావించు నెవ్వాడు కమనీయహిందూ మ
మహ్మదీయమత ద్వయాభివృద్ధి
గీ॥ అతఁడు మహబూబియా భూవరాత్మజుండు
మంజులోస్మానియానామమండితుండు
శ్రీ కరీంనగరాఖ్య ప్రసిద్ధనగరి
నధికదయఁ జూఁచుగాత నిరంతరంబు

45. సమస్య.

క॥ విష్ణుసుతమాయ కెవ్వఁడు
జిష్ణుండై నిల్వనేర్చు స్థిరదినకరరో

చిష్ణుఁడు గోపులముద్దుల
కృష్ణుఁడు నపకృష్టుఁడయ్యెఁగీర్తింపంగన్

46. సమస్య.

శ్లో॥ సంసారేభవ భూయిష్ఠే । కింఫలం మాస్తుతేప్యకం
మాతేగర్భ ఉత్పత్తి ర్మాతేవికలతాపరా॥

47. సత్యప్రవర్తనము.

సీ॥ ఒకకార్యముంబూని యొనరింతునని బాస
చేసినచోఁ దానిఁ జేయఁగనుట
అవకాశముండిన యంతకునన్యుల
చిత్తంబులేర్చ యోజింపకునికి
చేయఁగానేరని చేతల కదిసేతు
నిదుసేతునని వచియింపకునికి
పరవిత్తకామినీ భాగధేయములందుఁ
జిత్తమాయత్తంబు చేయకునికి
గీ॥ జన్మకృత్యంబులగు నిజజనని జనకుఁ
బోషణము సేసి సౌఖ్యముల్ పొందఁగనుట
సత్ప్రజావతి సతి దయ న్సాకికొనుట
వర్తిలినవేని యది సత్యవర్తనంబు

48. సత్యప్రవర్తన ప్రయోజనము.

సీ॥ తనతోడివారి కృతజ్ఞత నార్జించు
సూనృతవాఙ్ముఖ్య శుద్ధశీలి

తనతోడి సఖుల నౌదార్యంబునార్జించు
సూనృతవాఙ్మయ శుద్ధశీలి
తనతోడివారి సద్వినుతుల నార్జించు
సూనృతవాఙ్మయ శుద్ధశీలి
స్వజన సంప్రాప్త శిక్షణమును మఱలించు
సూనృతవాఙ్మయ శుద్ధశీలి
గీ॥ సర్వసౌఖ్యచమూసమార్జన మెగాక
సత్యలోకనివాస నిష్ఠ యుఘటించు
శాశ్వతయశంబునం ధరాస్థలి జెలంగు
సత్యశీలమ్ము సజ్జన సన్నుతమ్ము

49. కమలము—పదాద్యక్షరనియమము.

చ॥ కలమృదురావసంకలితగానము నయ్యెల దేంట్లు సేయఁ గో
మలతరమారుతాంకుర సమంచిత వీజనలాదిగాఁగ లీ
లల దళముల్ నటింపఁగ విలాసవిభాసిపరాగరాజి యి
మ్ములఁజెలరేఁగఁగాఁగమలముల్ ప్రమదంబిడు శ్రీనివాసముల్

50. శరత్కాలము

కవిరాజ విరాజితము

ఘనరుచిభాసినిశానిచయంబులు గానఁగనయ్యెడి దీర్ఘములై
కనదుడుసంతతి యాకసమెల్లను గానఁగనయ్యెడి స్వచ్ఛములై
ఘనఘనసంతతి క్లాంతివిహీనత గానఁగనయ్యెడి శుభ్రములై
కను శరదంచితకాలదినంబులు గానఁగనయ్యెడి హ్రస్వములై

### 51. సత్యనారాయణ స్తవము. నిరోష్ఠ్యము.

గీ॥ కలిత కలుష సందారణ కౌశలుండు
ఆశ్రితజనాళిరక్షకుం డలఘుజనుఁడు
కోరికలొసంగి యెల్ల సద్గుణులఁ గనుత
గ్రాహ్య చరితుండు సత్యనారాయణుండు॥

### 52. సమస్య

సీ॥ పాపంబు నానోటఁ బలికించి యొప్పించి
యుబ్బుమానవ జన్మ మొసఁగినావు
పాపంబు నానోటఁ బలికించి యొప్పించి
యుబ్బు నజ్ఞతలోన నుంచినావు
పాపంబు నానోటఁ బలికించి యొప్పించి
యురుతమోవృత్తిలో నుంచినావు
పాపంబు నానోటఁ బలికించి యొప్పించి
యెగిరించు మూర్ఖత నిచ్చినావు
గీ॥ కాని యెన్నాళ్లు నీపాదకమలయుగము
నాశ్రయించినఁ గృపతోడ నరసి యిట్టి
సంసృతిఁ దరించు మార్గమొసంగవైతి
వార్తజనరక్ష ప్రోవవే! ఆంజనేయ!

### 53. సమస్య

సీ॥ రామ్రామాముజప్నాప్రైమాలు నప్నాయ
నం గ్రైతవర్షి సంతతులవారు

దైవమ్ము నెదుట సత్యమ్ము చెప్పగబాస
లాడెడు కూటసాక్ష్యములవారు
సాధువేషమునఁ గాషాయాంబరములూని
చేరి యనాథలం జెఱచువారు
ధర్మకార్యములని ధనము సమార్జించి
పరుల ముంచుచు బాగుపడెడివారు
గీ॥ పలువురున్నారు సుమ్మి యీకలియుగాన
నిట్టి జనముల సాంగత్య మిచ్చినావె
అకటయేరీతిఁగాతో భయంబుగల్గె
అఖిలమున్ నీవె ప్రోవవే ఆంజనేయ॥

## 54. సమస్య.

సీ॥ రాంరాముఁజప్నాపరైమాలునప్నా
బ్రహ్మవిద్యార్జనం గ్రాలువారు
నీది నాదనియెడు భేదమే లేదని
కేవలాత్మైక్యానఁ గేరువారు
దాన సంధాన**మే** స్తవ్యఫలప్రదా
యకమంచు సిరి విడనాడువారు
మోహరాగాది విస్ఫూర్తి నిష్ఫలమంచు
సత్యజపమ్ములన్ జల్పువారు
గీ॥ ధీరులున్నట్టి తావులందిరుగజేసి
భవభయంబఖిలం బెడబాపుమయ్య

తప్పులెన్నకు; దాసుని దండమయ్య
అఖిలమున్నీవె; ప్రోవవే; ఆంజనేయ॥

55. జీవి జన్మక్రమము.

సీ॥ బుద్ధివిజ్ఞాన వైభోగార్థకర్మముల్
పరగించి క్రిమ్యాది భవముగడచి
యచిరకాలంబున నవియెల్ల లంఘించి
జ్ఞానసమ్మాన్య జన్మంబులంది
స్వామి విశ్వాసాది సత్కార్యములఁజేసి
మానవజన్మంబు మహిమనంది
గోబ్రాహ్మణవ్రజాకుంఠార్చ నాదుల
ద్విజముఖాకృతుల నావిర్భవించు
గీ॥ ఈక్రమంబున నిసుమంతయేని గాని
బాపకార్యాచరణమునం బరగునేని
తిరిగియధమాధమభవంబు లరసికొనుచు
జీవి నిర్దిష్టభవయాత్ర జేయుచుండు॥

56. సూర్యోదయము.

మ త్త॥ అల్లనల్లనుషః ప్రభావములంతటన్ బ్రసరింపఁగా
నెల్లపాఱులు నక్షత్రవారుల నిచ్చుచున్ భజియింపగా
నుల్లలత్కమలాంతర భ్రమరోరుగానము లొప్పఁగా
నల్లదేతొలి దిక్కునందున నర్కబింబము దోఁచెడిన్॥

57. సమస్య.

గీ॥ ఆత్మదాక్షిణ్యముంగొన్న యట్టివారి
భక్తజనములఁ జూచిన భ్రష్టమతులు
పటిమ గోల్పోయి గడ గడ వడకువారు
సింగములగన్న గజముల భంగి ననఘ॥

58. సమస్య.

గీ॥ ఇంద్రియ జయానువృత్తిసమిద్ధమైన
హృద్య పరమాత్మ నీక్షించు నింద్రియములు
పటిమ గోల్పోయి వెల వెల బాఱకున్నె
సింగములఁ గన్న గజముల భంగి ననఘ॥

59. నియత కర్మ.

మ॥ ధరణిన్ ధర్మకలాభివృద్ధి రచనాధారంబుగా నుండి బం
ధుర దేవప్రతిషేవణాను గతులన్ దోడ్పాటు గావించి యు
ర్వర హోమంబు జపంబులున్ జలిపి భాస్వన్నిత్య కర్మ ప్రజా
చరణాలగ్నమనస్కులై ననఘులన్ సౌభాగ్యముల్ సెందవే॥

60. కరీంనగరపు గడియారపు కంబము.

సీ॥ అధిక దయాశాలి యైన యుస్మానలీ
షాహెదక్కనుగారు సరియనంగ
విమల దయాబ్ధి గోవింద నాయక్కాలు
కాదారుగారు సంకల్ప మీయ

అమలధీశాలి మహమ్మదలీగారు
నవ్యశిలా స్థాపనమ్ము సేయ
అనుపమ గుణశాలి హంటరుపాఖ్యుండు
మొహిదీనలీగారు పూర్తి సేయ
గీ॥ నాఁడు నేఁడును దత్ప్రయత్నముల కీర్తి
సర్వ దేశమ్ములందునం జాటుకొనుచు
నగరమునకెల్ల వింత సౌందర్య మొసగు
నదిర గడియారపుంగంబ మంచితంబు॥

## 61. దుర్గా ప్రార్థన.

పంచ॥ తమః ప్రభావ మెల్ల రుగ్విధాతృ దర్శనంబునన్
శమంబునొందు చంద మొప్ప సర్వపాప సంతతుల్
శమించు నీకతాన దుర్గ సర్వలోక పావనీ
సమస్తదోషరాజి బాపి సాకు కన్నతల్లిరో॥

## 62. పరసేవనము నీచము.

శ్లో॥ యద్వృద్ధీవ్యతి నిత్యకర్మ విషయంచాచారధర్మవ్రతం
ధీమాన్యః పరసేవనే కలయితుంశక్తోనహిప్రస్ఫుటం
లాభాద్యాచరణాదపి ప్రతిహతో భ్రష్ట స్స్వకీయాన్మతాత్
తస్మాదన్య జనస్యదాస్య రచనా సందూష్యమానా భవేత్

## 63. ఉద్యోగము పురుషలక్షణము.

శ్లో॥ మతిప్రభావస్తు యతోపిదీవ్యతే
యశోధనంచాపి యతస్సమార్జ్యతే

సముద్యమార్థః ప్రతిగృహ్యతే యది
నరస్యతూద్యోగ విధిర్హి లక్షణం   స/668

64. చిన్నప్పుడు జానెడు పెద్దప్పుడు బెత్తెడు

గీ॥ భవభయవిశేష మదియలవడమిఁ జేసి
బాల్యమున భావమోదంబు ప్రబలియుండు
దీనిగనఁ జిన్ననాఁటను జానెడంత
పెద్దయానాఁడు బెత్తెడగు విధమునిజము

65. స్వేచ్ఛాజీవులు

సీ॥ పరులయాశ్రయము జీవనము హేతువ సేయు
జనులు స్వేచ్ఛాజీవు లనఁగరాదు
సంసారబంధప్రచార నిమగ్నులౌ
జనులు స్వేచ్ఛాజీవు లనఁగరాదు
వ్యవహారసముచిత వ్యాహారశూన్యులౌ
జనులు స్వేచ్ఛాజీవు లనఁగరాదు
ఉదరపోషణ సంతతోద్యోగనిరతులౌ
జనులు స్వేచ్ఛాజీవు లనఁగరాదు
గీ॥ కేవలాత్మైక్య విద్యారహస్యమెఱిఁగి
మోహరాగాది పంకంపుఁబూతగొనక
వాసుదేవకృపార్హతఁ బడయనైన
యట్టివారె స్వేచ్ఛాజీవు లనఁగవలదె

### 66. సత్పురుషలక్షణములు

ఉ॥ ధీరవచస్కులాడి తుదిదేల్పఁగఁజూచెడువారు నాత్మసం
సారములోన దైవికవిచారణ సేసెడువారు నర్థి పూ
జారతి మున్నుగాఁ జలిపి సంస్తవపాత్రత నందువారలే
ధీరులు నుత్తమోత్తము లిదే తమలక్షణమంద్రుచూడుడీ

### 67. ఆత్మ పరమాత్మభేదము

గీ॥ ఆత్మవిషయము సర్వజీవ్యధిగతంబు
కేవలాధ్యాత్మికాధి శక్తిందలంప
పరమరూపై కవిగ్రహభాసితంబు
ఆత్మకధ్యాత్మకుం భేదమదియనుండు

### 68. సమస్య.

చ॥ ఘనమృగతృష్ణలోన నుదకంబులు ద్రావఁగనైనదోషమున్
మునుకొని పెద్దయెద్దు బనిబూనిచి గానుగఁద్రిప్పి సైకతం
బునఁదగుతైలముందిగియఁ బోయెడు దోషమువానికంటె జ
క్కనిశశశృంగదోషమును గల్గునె సూర్యున కెన్నఁడేనియున్

### 69. రక్తాక్షి మంగళసూచనము.

మ॥ భగవన్మంగళకార్య భవ్యరచనాప్రారంభ సంరంభముల్
సొగసుం దావు శతావధాన కవితాశోభానుసంధాన మీ
నగరంబందునఁ దోల్తఁగాఁజరుగుటన్ రక్తాక్షిసంవత్సరం
బగుసౌఖ్యప్రతిసూచకంబనఁగనయ్యా! యిందుసందేహమా?

70. మానవ తరుణోపాయములు.

మ॥ నిరతంబున్మతిమాంద్యమున్గొనకధ్యానింపన్వలెన్ దైవ
మున్

ధరణీదేవసమర్చనంబును సముద్యద్గోచమూరక్షణం
బు రచింపన్వలె సత్యధర్మముల నామోదంబు నందన్వలెన్
తరుణోపాయములన్న నివ్వె నరజన్మప్రస్థితార్యాళికిన్

71. ద్రవ్యవినిమయ మార్గములు.

గీ॥ దైవసంస్థాపనంబు నుత్తమధరామ
రేంద్రసంరక్షణంబు నహీనమాతృ
వాక్ప్రవర్థనమును గ్రతువర్ధనంబు
వినిమయార్థపథంబులు విత్తమునకు॥

72. అన్నదానము.

గీ॥ దైవనుతి తుల్యమైన యుద్యమము లేదు
తనయ తుల్యురు ప్రేమవర్ధకులు లేరు
అన్నదానంబుతోడఁ దుల్యంబునైన
దానభాగ్యంబు గనరాదు ధన్యులార॥

73. కృష్ణపరమాత్మ యోనిసంభవము.

శ్లో॥ యస్మాద్దైహిక దృష్టిమాత్ర విషయాన్మాతాకృతా దేవకీ:
నిత్యాముష్మిక మాన్యదృష్టివిషయాదాద్యంత హీనస్మృతః
యస్మాద్దివ్యదృశాసమస్తమునిభి స్సందృశ్య తేవ్యక్తితో:
యోన్యాం సభవితోస్తినాపి భగవాన్ శ్రీకృష్ణలీలామయః

74. హిరణ్యాక్షుఁడు భూమిని జుట్టునపుడు తానెటనుండె?

మ॥ అవనిన్ సర్వముఁజాపచొప్పునహిరణ్యాక్షుండుమున్ జుట్టెసం
స్తవనీయంబగుఁగాని తద్బుధుఁడు తత్కాలాంతరంబందునెం
దువిజృంభించెన? పంచభూతములలో ద్రోయంగనాధార్త్రిను
న్నవిశేషంబులనిందు తావునన యన్నానిల్చెఁజిత్రంబుగన్

75. సమస్య.

ఉ॥ మక్కువపెంపుఁజేసి యలమాధవుఁడే ధవుఁడైనఁ గూర్మిపెం
పెక్కనటంచు సత్యవరియించె రమాధవుఁ దత్పదాబ్జపుం
జొక్కపు జుంటి తేనియలచూఁఱిలెగాక యు గెంపుమోవిబల్
చొక్కపుజుంటితేనెఁ జవిజూచెను జవ్వనిభాగ్యమెట్టిదో

76. విధవా వివాహము.

శ్లో॥ భుక్త్వైకా గేకిల సోమపవవనితాం గంధర్వరాట్పావక
స్తస్మాత్పాపస్మృతిమానవోత్తమ ఇతిప్రోక్తిస్తు శాస్త్రోదితా
ప్రామాణ్యేనతు గృహ్యతే యదితదా భుక్తాసతీ చైక
నష్టాది ప్రియవల్లభా పరిణయేనార్హాపునః కామినీః

77. ప్రయత్నప్రారబ్ధములలో విశ్వసనీయమేది?

మ॥ అవనిన్ షడ్విధమానవోద్యమములన్ హాళిన్ బొసంగించియే
డవ భాగంబునదైవ యత్నమునకై యర్థింపఁగానొప్పునం
చు విశేషజ్ఞులు సెప్పియుండ నరుఁడస్తోక ప్రయత్నంబు మీ
ఱ విరాజిల్లగఁ జెలుగాని తగునేప్రారబ్ధవిశ్వాసముల్

78. సాధ్వీలక్షణము.

ఉ॥ శ్రీరమణార్చనంబును నశేషగుణాఢ్యధవాంఘ్రిసేవ సే
వారతదాసదాసులను భవ్యకృపావిభవంబు నార్యులన్
గౌరవముం సపత్నుల నఖండసమానసమీక్షణమ్ము నా
చారహితంబు శాంతియును సద్వనితోచితలక్షణంబులౌ

79. రాజసభాప్రవర్తనము.

సీ॥ నియమితపదవులన్ నిలిచియాచారాను
కూలవందనములం గూర్పవలయు
నుర్వీనాథునికన్న న్యూనవేషముం దాల్చి
నమ్రతతోడం బెనంగవలయు
రాజవల్లభకృపాగ్రహణార్హ వైఖరిన్
సముచితారాధనల్ సలుపవలయు
సింహాసనమ్మధిష్ఠించు భూనాథుండు
లేచినచోం దాము లేవవలయు

గీ॥ రాజులందున విష్ణ్వంశ గ్రాలుకతన
రాజభక్తియు స్వామికార్యప్రచార
భారవహనైకసిద్ధతన్ బడయవలయు
జనము లుర్వీశఘనసభాస్థలములందు

80. భగవద్దర్శనము.

సీ॥ ధర్మసంవర్ధనాధారంబుగా నుంట
దేవళంబులకు నేతెంచుడయ్యా

ముక్తిసంపాదకళ మూలంబౌట
దేవనామంబు స్తుతింపుడయ్య
అఖిలార్థసంపద కాదిమూలంబౌట
మరుదాత్మభవునకు నెఱఁగుఁడయ్య
మంగళాశీర్వాదమంజులంబులునౌట
సంవత్సరోత్సవాల్జరపుఁడయ్య
గీ॥ భావిభవనీయభవనైజభాతికెల్ల
దైవమే కారణంబని తలఁచుఁడయ్య
అన్యహేతువు లెన్న ననర్థమయ్య
అన్నలార! కరీంనగరార్యులార!

## 81. సమస్య.

ఉ॥ మాతలియయ్యనూరుఁడు సమంచితశోణమయప్రదీప్తిసం
జాతముఁబంచెనా సరసిజంబులు నుల్లసమందె దారకా
వ్రాతముఁగ్రుంకె జవ్వనులభావముల్ దిగులందనేగె నా
రాతిరివేళ; భాస్కరుఁడు రమ్యముగానుదయించెఁదూర్పునన్

## 82. భక్తులు.

సీ॥ ప్రహ్లాద నారద వరపరాశర పుండ
రీకులున్ వ్యాసాంబరీష యుగము
శుకశౌనకులును భాసుర భీష్మ రుక్మాంగ
దార్జునులు వసిష్ఠు డాంజనేయుఁ

డఁట బలిభూపుండు న వ్విభీషణుఁడును
భక్త వల్లభులుగాఁ బరగువారు
భగవదాఖ్యానంబుఁ బరమహితంబుగాఁ
దిలకింప నేర్చిన ధీరమతులు
గీ॥ సరసిజాక్షు పదాంబుజస్మరణఁజేసి
సత్యకైవల్య భోగప్రసక్తి నంది
నట్టి మహనీయు లమలదేవాంశభవులు
భక్తి గొలుపంగ నాత్మలోఁ బ్రస్తుతింతు॥

83. ఆంధ్రభాషా వ్యుత్పత్తి

చం॥ ప్రకృతినిబుట్టి తత్సమపుభాతిని గొంతయుఁదద్భవంబునన్
బ్రకటితదేశ్యరూపమునగ్రామ్యముఁనన్మఱికొంత పుట్టియున్
సకలకలాంతరస్థ రసనంగత మాధురి నుంత లెక్కసే
యకసుమనస్కులన్దనుపునాంధ్రసరస్వతి కేనుమ్రొక్కెదన్॥

84. సంస్కృత కవీశ్వరులు.

శ్లో॥ వ్యాసస్సన్నుత కాళిదాస సుకవి శ్రీహర్ష భాసాభిధా
దండీ భారవి భట్టబాణ బిరుదా మాఘాస్తతో బిల్హణః
సంభావ్యో భవభూతి మల్హణబుధౌ వాణీ స్వరూపాంతరా
యే యేసత్కవివల్లభాహి సకలాన్ ధ్యాయామితాన్ సర్వదా॥

85. భాషానిలయమువలని లాభము.

శా॥ ఏనాఁటన్ బలుచోట్లనేమిపనులున్ వృత్తాంతముల్ సెల్లునో
యానాఁటన్ సకలాంధ్ర పత్రికలసాహాయ్యంబునన్ జేసి మే

ధానాధుల్ పరికింపఁ జాలుదురు విద్వద్గౌరవంబుంట న
న్యూనోత్సాహముఁ గూర్చు వాఙ్నిలయలాభోదంతమా! వర్ణ్యమా

### 86. సంస్కృతభాష.

గీ॥ సర్వభాషలకును నాదిజననియగుట
నెల్లధర్మములకుఁ గన్నతల్లియగుట
వేదశాస్త్రాదిపోషకవిద్యయగుట
వేల్పుబాసను శిరమునఁ దాల్పవలదె

### 87. ఐకమత్యము.

చ॥ తృణములు వేఱవేఱవిడఁదీసినఁ ద్రెంపఁగవచ్చు రెమ్మలన్
బనిగొని వేఱవేఱ విరువందగు నంతియగాని వాని నె
ల్లనునొకప్రోవు సేసికొని లావుగొలందియుఁ ద్రెంపి వైవఁజూ
చిన వశమౌనె యైక్యమునఁ జెందిన సత్యము వేఱగలునే

### 88. పరోపకారము.

మ॥ జనముల్ భూరిపరోపకార ఘనతాసంధానసంరంభమం
దనరన్ శక్తిగొలంది యర్థులనియుద్బోధించి పౌరాణికో
క్తిని, భక్తిప్రతిబోధనంబునను వాగ్దీప్తిప్రవృద్ధిన్ దయన్
గొనునధ్యక్షునిఁ బ్రోచుఁ గాత హరి శ్రీగోపాలరాయాఖ్యునిన్

### 89. పరనింద, ఆత్మస్తుతి.

మ॥ పరనిందాచరణంబునందున క్షమాభావంబు సూచించి దు
ర్భరమౌ స్వస్తుతియందునన్ దగనిగర్వంబుం బ్రబోధించి యు

ర్వార దార్మత్యవివర్ధకంబులగుచుఁ రాజిల్లుటన్ జేసి యె
వ్వారికేనిం బరనింద స్వస్తుతియుఁ జల్పం జెల్లదో మిత్రమా

90. ఉస్మానియాబాదుషాగారి కాశీర్వాదము.

సీ॥ దేవాలయాది ప్రతిష్ఠ హేతువ జేసి
స్తవనీయ దేవ సంస్థాపకుండు
దినభుక్తము న్నిగా స్థిరవృత్తులిచ్చుటన్
బ్రాహ్మణాధీర సంస్థాపకుండు
ఉన్నతన్యాయసభోద్యోగమునఁ జేసి
రాజధర్మవితాన రక్షకుండు
సర్వసాధారణ సద్వనిం గూర్చుట
సన్నుతారామ సంస్థాపకుండు
గీ॥ సత్కలాసంచయాభిరతప్రయత్న
లోలవృత్తి సుల్తాను లులూమ్సమంచి
తాంకితుండు వాని సర్వలోకైకకర్త
యోముతన్ విభు నుస్మానియామహీశు॥

91. సభాప్రార్థన.

సీ॥ ధీరార్హ ధారణా ధక్యముఁ జూపించి
తనిపితినో లేదా ధన్యులార
కమనీయధారా ప్రకారంబుఁ జూపించి
మెప్పించితినో లేదా మిత్రులార

పండితకవితార్థ భావచాతుర్యముల్
తీర్చితినో లేదో ధీరులార
అవధాన సముచిత వ్యాహారవైఖరుల్
పరగించితినో లేదో భవ్యులార॥
గీ॥ అఖిలశాస్త్రార్థ విజ్ఞాన మరయకుంట
దప్పులే చెప్పి నాఁడనో సభ్యులార
అన్ని మన్నింపుడయ్య దయాఢ్యులార
అన్నలార! కరింపగ రార్యులార॥

92. పౌరులకుఁ గృతజ్ఞతా వందనములు

సీ॥ మోటారుదిగివచ్చి మ్రోలనిల్చినతోఁడ
నాలింగనము సేయు నర్హమతులు
వచ్చితినని చెవింబడిన మాత్రమ్మున
నలఘుమోదంబందు నమలమతులు
శతవధాన విధాన చాతుర్యముంజూపి
తనుపుడీయ నెదు నుదారమతులు
మాయింట మాయింట మాయింట ననికోరి
ఆహారమొసగిన యట్టిఘనులు
గీ॥ శతవధాని సమర్థప్రాపన క్తి
రెండునూర్ల్లార్లు సమకూర్చియుండె నొక్కొ
అనుచుదమలోనఁ దామనుకొనెడువారు
ప్రాజ్ఞులగు మీకు వేవేలు వందనములు

### 93. స్వీయచరిత్రము.

సీ॥ ఆవాసమా? సత్ప్రదాంబుధారాధార
నిర్మల కృష్ణవేణీతటంబు
అన్వవాయంబ? కలావ్యాపారసాగర
యజ్ఞోపవీతసమాహ్వాయంబు
పాండిత్యమా? నవాఖండపూర్వాశయ
ప్రాంచితపంచవాక్పరిచయంబు
చాతుర్యమా? సభాసజ్జన సన్నుత
శతవధానాది ప్రసారణంబు
గీ॥ అభినవోద్యోగమా! సహస్రావధాన
జయమహాధ్వజ శాశ్వత స్థాపనంబు
వ్యక్తినామధేయంబ సుబ్బన్నయంద్రు
అన్నలార కరీంనగ రార్యులార!

### 94. కరీంనగర సభ్యుల యాదరణము

మ॥ ధరణీనాథుల వేడుచుఀ, నగరసంతానంబు నర్థించుచుఀ
దిరుగంజాలితి నేని యర్థము యథోద్దేశంబు నార్జించి స్వో
దరసంపోషణ సేసికోలది యథార్థంబైన మీరిచ్చు నా
దరముల్మాత్రము వేఱుచోటుల ననత్యంబేసుడీ ధీనిధుల్.

### 95. సభావియోగసమయభావము.

సీ॥ మఱలనెన్నాళ్లకు మరుదాత్మజాలయ
మున సత్సభాగోష్ఠిఁ బెనఁగఁగలనో

తిరిగి యెన్నాళ్ళ కీ పురిధీరవర్యుల
ప్రశ్నల కుత్తరాల్ పలుకగలనో
క్రమ్మర నేనాఁడు ఘన కరీంనగరార్య
పుంగవులకు భక్తి మ్రొక్క గలనో
ఇఁకనెన్ని నాళ్లకు నీమహాత్ముల మహా
శీర్వాద వైఖరుల్ సెందఁగలనో
గీ॥ అదిర! సుబ్బనకవి సహస్రావధాన
వైఖరింజూప సందియంబా యటంచు
మెచ్చుమీలోన నెపుడింక మెలఁగఁగలనో
అన్నలార! కరీం నగరార్యులార॥

96. ఆంజనేయ ప్రార్థన–రామసేవాగ్రహణపర్యంతము

శా॥ శ్రీరాముండరుదెంచుమాత్రమున సుగ్రీవాజ్ఞనుంగొంచు
లోకారాధ్యంబులఁ దత్పదాబ్జముల నత్యంతంబు సేవించి సీ
తారామామణిజాడఁ దెత్తు ననుచున్ సాధించునో దేవరా!
వేఁతేదిక్కెవరింక బ్రోవగదవే వీరాంజనేయ ప్రభూ!

97. ఆంజనేయ ప్రార్థన–రామక్షేమ విజ్ఞాపనము.

శా॥ వారాశిందగదాటి శాత్రవపురీ భాగంబులన్ జొచ్చి ఘో
రారామంబున భూమిపుత్రికి నయోధ్యాధీశు క్షేమంబు వి
స్ఫారానందము దోఁపఁ జెప్పనగునో భవ్యాత్మ సౌఖ్యప్రదా
వేఁతే దిక్కెవరింకఁ బ్రోవగదవే వీరాంజనేయ ప్రభూ!

98. ఆంజనేయ ప్రార్థనము—లంకాదహనపూర్వకము.

శా॥ ఆరక్షఃపతికిఁ బరాభవము సేయం జూచి వైర్యావళుల్
ఘోరాగ్నిం గొలుపంగ వాలమున కర్కోటనఁ వెసంద్రిప్పి శృం
గారారామము గాల్చివచ్చిన మహాగాంభీర్య ధీవారిధీ
వేఱే దిక్కెవరింకఁ బ్రోవగదవే వీరాంజనేయ ప్రభూ॥

99. ఆంజనేయ ప్రార్థనము-బంధమోక్షణపూర్వకము

శా॥ వీరావేశముతోడ నీదుఘనదోర్వీర్యప్రభావంబునుఁ
నేరంజాలక కట్టివైచి రహహా నీవేడ నిన్బట్టి యా
క్రూరుల్ బంధన సేయుటేడ? నది నీకుఁ లెక్కయే?మత్పితా!
వేఱే దిక్కెవరింకఁ బ్రోవఁ గదవే వీరాంజనేయ ప్రభూ॥

100. ఆంజనేయ ప్రార్థన.

శా॥ శ్రీరామాజ్ఞ శిరంబునందునిచి తత్సేవాభిసంభాసివై
మీయంజాలి యనంత వర్షములు భూమీభాగమందుండి సు
శ్రీరక్షార్థము వేడు భక్తతతి రక్షింపంగ నా శ్రీవరా!
వేఱే దిక్కెవరింకఁ బ్రోవగదవే వీరాంజనేయ ప్రభూ॥

101. మంగళము.

ఉ॥ మంగళ మార్య సంతతికి మంగళ మర్హసభాజనాళికిఁ
మంగళ మీకరీంద్రగర మాన్యజనాళికిమిత్రరాజికిన్
మంగళ మీమహాత్మునకు మారుతికిఁ గరుణాంబు రాశికిఁ
మంగళమయ్యెడుఁ సకల మంగళకారణ దేవకోటికిఁ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## —* సభానంతర పద్యములు *—

సీ॥ ఆంధ్రగీర్వాణములందు సంపూర్ణ శ
తావధానజయంబు నరసినారు
ఈపద్దెమాపద్దె మేదిసెప్పుడటంచు
నర్థించి విని మోదమందినారు
అందందునాశుధారాధిసల్లాపంబు
లంది యాశ్చర్యంబు నందినారు
శయ్యారసాదిక సరసతంత్రగహియించి
బాపురేయని తలలూఁపినారు
గీ॥ తొలిఁ బదేండ్లకు మున్నారంగలుపురానఁ
బడయుపూర్ణయశము ధ్రువపఱచినారు
శ్రీ కరీంనగరార్యుల ప్రేమఁగనవె
భవ్యరంజని! సుబ్బన్నపల్కుసాని
సీ॥ పుష్పమాలికలు గుంపులుగుంపులై వైచి
పూసోనవానల ముంచినారు
ఈశక్తికేపాటి దింతగౌరవమని
యిన్నూటపదియాఱు లిచ్చినారు
ఆబాలగోపాల మదుగులం గన్నద్ది
శిరసావహించి పూజించినారు
బ్యాండుబాజాల వైభవముతోఁ బండుగ
సేసి యూరేగింపు సేసినారు

గీ॥ ఇంతకన్నను వలసినదేమి నీకుఁ
జదువుకొన్నందు కీజన్మ సఫలమయ్యె
శ్రీకరించంగ రార్యులఁ బ్రేమఁగనవె
భవ్యరంజని! సుబ్బన్న పల్కుసాని॥

సీ॥ మంత్రపుష్పాదిక మంత్రపాఠములతో
దేవదర్శనము లందించినారు
బ్రాహ్మణస్వస్తి నిర్వచన వైఖరితోడ
విడిదిగేహమున కంపించినారు
కాఫీలు పాలు భక్ష్యములిచ్చి యుపహార
విధిమనశ్శాంతి గావించినారు
భారతీశాంతి సమారాధనము సేసి
కేసరిభాతు మెక్కించినారు

గీ॥ అభినవసరస్వతీబిరుదార్పణమున
యశముఁబెంచి యేటేట రా నడిగినారు
శ్రీకరింసగ రార్యాళిఁ బ్రేమఁగనవె
భవ్యరంజని! సుబ్బన్న పల్కుసాని॥

సీ॥ సాంగసంపంగఁ బునస్సభ సేసి జయ జయ
ధ్వానముల్మిన్నంటఁ బలికినారు
నెత్తావియగరులవత్తుల సందించి
ఘుమఘుమాయింపులం గూర్చినారు

నగరమధ్యంబున న్బసుపుగుంకుమతళ్కు-
మించుల నోలలాడించినారు
యనలేక యనలేక యరిగెదవాయని
యెడఁబాపుగాఁగిళులిచ్చినారు
గీ॥ యంత్రశకటాగ్ర పీఠమునందు సౌఖ్య
మలవడంజేసి నిను సాగనంపినారు
ఇట్టిమిత్రులఁ విడనాడియేఁగఁగలవె
భవ్యరంజని! సుబ్బన్న పల్కుసాని

సీ॥ తిరిగి యెన్నాళ్ల కేతెంచి ప్రమోదంబు
నించెదవని కౌఁగిలించువారు
పసుపుగుంకుమ సేసబ్రాలతోఁదలముంచి
తేలిచి యాశీర్వదించువారు
విమలయశంబుమై విబుధసేవలఁజేసి
వన్నెకెక్కుమటంచుఁ బలుకువారు
మఱువకుమా మమ్ము మదినుంచుమా యంచు
వెలలేని ప్రేమచూపించువారు
గీ॥ నైనయుస్మానియాంధ్రభాషాధినిలయ
సభ్యులగు నన్నలకు నింతశ్రమముగల్గె
నేఁగి వచ్చెద నిండ్లకు నేఁగుడనవె
ప్రణయముంబూని సుబ్బన్నపల్కుసాని

శతావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి.

## బ్రహ్మశ్రీ వారణాశి వెంకటసుబ్రహ్మణ్యదాసుగారు.

సీ॥ మునుముందు జయవాడపురమున బుధసభ౯
బాలసరస్వతీ లీలజూపె
అంతననంతవరాఖ్యపురమ్మునఁగవి
మణిబిరుదార్హ గరిమఁజూపె
అలయొజ్జుపాలెమునందున గవికేస
రికిశోరబిరుదార్హ రీతిఁజూపె
అటనిందుపల్లి శతావధానకుశలబిరు
దార్హచాతురీసరణిఁజూపె

గీ॥ ఓరుగంటి శతావధానోద్యమమునఁ
బూర్ణవిజయంబు నొందె నీబుధవరుండు
శతవధాని సుబ్రహ్మణ్యశాస్త్రివరుఁడు
మనదుభాగ్యవశానదర్శనమొసంగె

సీ॥ ముంగురుల్ కుంకటేముడికిఁబోలనినాఁడె
కమనీయకవనవైఖరులఁజూపె
బాల్యంపులీల లేపాటి మదిరి నాంగ
అష్టావధానంబు నాచరించె
యౌవన సౌభాగ్య మంకురింపని నాఁడె
యశ్వపరీక్షలయందు నిలిచె

నిండుజవ్వనము మైనిండారుపూర్వమే
పంచకలా పరిపాటిగాంచె

గీ॥ ఇన్ని యేఁటికి మీమ్రోల నిన్న నేఁడు
శతవధానంబుగావించి జయమువడసె
ఈతఁడభినవభారతి యేలగాఁడు
శ్రీకరీంనగర సభాబుధేంద్రులార

శ్రీ శ్రీ శ్రీ



